# కవిరాజు శతకాలు-గీతాలు



కవిరాజు:
త్రిపురనేని రామస్వామి చౌదరి,
శతావధాని, బారిష్టరు.

ఆగష్టు, 1964 2 వెల : రు. 2-50

# కవిరాజ సాహిత్యవిహారము
## గుడివాడ

ముద్రణ :

సాయిబాబా ప్రెస్ – విజయవాడ-1

ప్రకాశకులు :

అన్నపూర్ణ పబ్లిషర్సు,

ఏలూరు రోడ్డు :: విజయవాడ-2

# విషయసూచిక







# గీతములు

గొంటరులఁ దుంటరుల గుమి ♦ గూర్చి సృష్టిఁ
జేసి చీటికి మాటికి ♦ డాసి వారు
తన్నుకొని చచ్చుచుండఁగఁ ♦ దనియుచుండు
గొప్ప వానికి జేజేలు ♦ కుప్పసామి. ౧

ఏడో, పద్నాలుగో, మూఁడో ♦ యెన్నో, జగము
లెల్ల సృష్టించి నటువంటి ♦ యీశుఁడొకరో
యిర్వురో, యెందఱో వారి కెల్ల నేటి
కోళ్ళ నర్పింతు భక్తితోఁ ♦ గుప్పసామి. ౨

చిన్న పిల్లలకును దల్లి ♦ చెప్పునటులఁ
దెలుఁగు మాటల పొంకంబుఁ ♦ దీర్చి దిద్ది
తెలిసి తెలియక యర్థంబు ♦ తెలియునటులఁ
జెప్పఁబూనితిఁ గఱదలు ♦ కుప్పుసామి. 3

మున్ను పెద్దలు చెప్పిన ♦ వెన్నో కలవు,
ఎన్నకుండిన నీతులు ♦ కొన్ని కలవు
పేరుగా గ్రుచ్చి మెడలోన ♦ వేతువానిఁ
గుతిల పడకుండఁ దాల్చుము ♦ కుప్పుసామి. ౪

కమ్మ నెత్తావి దెసలెల్లఁ ♦ జిమ్మునట్టి
గంధఫలి చెంతఁజేరదు ♦ గండు తేఁటి
తేనె లేదన్న సంగతిఁ ♦ దెలిసికొనుచుఁ
దప్ప కీనీతి స్మరియింపు ♦ కుప్పసామి. ౫

పూలు తెగఁబూసినప్పుడు ♦ మూఁగుచుండుఁ
దేనెటీఁగలు పైఁబడి ♦ తేనెకొఱకు
స్నేహితులు కొంద ఱీరీతిఁ ♦ జేరుచుందు
రప్పుడప్పుడు కనిపెట్టు ♦ కుప్పసామి. ౬

పండ్ల చెట్లక్రిందకు నెట్టి ♦ బాటసారి
యూఱకేరాఁడు ఫలమును ♦ గోరివచ్చు
వాని నొకకంటఁ గనిపెట్ట ♦ వలసియుండు
గోల గాకుండ సుంతైనఁ ♦ గుప్పసామి. ౭

ఒకనియెడఁ గృతఘ్నతఁజూపి ♦ యున్న వాని
నమ్మియుండుట తగదు లే ♦ నమ్మ కూడఁ
దనకు లాభంబు కల్గుచోఁ ♦ దత్క్షణంబ
ముప్పు తప్పక చేకూర్చుఁ ♦ గుప్పసామి. ౮

ఒక్కమానవుండు ♦ డొక్కచీల్చినంగాని
నారికేళఫలము ♦ నీరు నీదు
గొంటుకాని నిట్లు ♦ గోరాడకుండిన
నొప్పుకలుగనీడు ♦ కుప్పుసామి. ౯

పిలువకుండ వచ్చి ♦ పెద్దమాటలు చెప్పు
వానినెపుడు నమ్మ ♦ వలదు, వలదు
మేలుకలుగబోదు ♦ మెఱమెచ్చుల కతండు
తప్పుచెప్పుచుండుఁ గుప్పుసామి. ౧౦

నీతిలేనివాని ♦ నిరసించు జగమెల్ల
నీతిశాలి కెపుడు ♦ నెగడులేదు
నీతిశాలి నెపుడు ♦ నీతియే కాపాడుఁ
గుజనుబారినుండి ♦ కుప్పుసామి. ౧౧

నాలిమ్రుచ్చు నెపుడు ♦ నమ్మరా దాతండు
కొంపఁదీయగలఁడు; ♦ కుదురుకుండఁ
గొండచిలువ యట్టి ♦ గుటుకున దిగమ్రింగుఁ
గుతిలపడఁగ జీవి ♦ కుప్పుసామి. ౧౨

పరుని నీముందుఁ దిట్టెడు ♦ వాఁడు నిన్ను
నొరుని ముందటఁ దిట్టక ♦ యుండఁబోఁడు
చనవు రవ్వంత వాని కొ ♦ సంగరాదు
ముప్పవచ్చుఁ దప్పక దానఁ ♦ గుప్పసామి. ౧౩

నమ్మకంబున్న లేకున్న ♦ నచ్చకున్నఁ
బరులమాటకుఁ దలయూఁచు ♦ వాఁడు సత్య
మాత్మ గౌరవమే లేని ♦యట్టివాఁడు
ముప్పుపుట్టు వానిని నమ్మఁ ♦ గుప్పసామి. ౧౪

ఒరుల గొప్పతనముఁజూచి ♦ యోర్వలేని
పురుషుఁ డెందు వేదనఁబడి ♦ పొక్కిపొక్కి
తెవులులేకయే తెగటారుఁ ♦ జివరకతఁడు
తప్ప దీమాట వేదంబు ♦ కుప్పసామి. ౧౫

వదరి యూరకే అంకెలు ♦ వైచువాఁడు
పట్టుమన నెట్టిపనికైనఁ ♦ బనికిరాఁడు
వానఁ గురియదు శారద ♦ వారిదంబు
తప్ప కుఱుముచుండునుగాని ♦ కుప్పసామి. ౧౬

అప్పులిడువానితోడను ♦ జెప్పులున్న
వానితోడను బైనంబుఁ ♦ బూనఁదగదు;
చింతసేయక పయనంబుఁ ♦ జేసిరేని
యొప్పమి ఘటిల్లు నద్దానఁ ♦ గుప్పసామి. ౧౭

పుటము వెట్టినపుడె ♦ పుత్తడి యిత్తడి
తెలియఁగలదు వేఱె ♦ తెలియరాదు;
సిలుఁగులొందునపుడె ♦ చెన్నఁటి సుగుణులఁ
గూడఁ దెలియఁగలరు ♦ కుప్పసామి. ౧౮

ఏటినీరుపొడువ ♦ నెక్కలి యిసుమెల్ల
నీటితోడఁ బోవు ♦ నిలువకుండఁ
బెద్దవారితోడఁ ♦ బిన్నలీరీతిగాఁ
దప్పకేగుచుంద్రు ♦ కుప్పసామి. ౧౯

గుడికిఁ దఱచుపోయి ♦ గొణుగుచుండెడివాఁడు
చెడ్డపాపమేదొ ♦ చేసియుండు
నదియె వానిఁబట్టి ♦ యట్టిట్టు పీడింప
గుడికిఁ బోవు నతఁడు ♦ కుప్పసామి. ౨౦

ప్రొద్దుపొడువకుండ ♦ నిద్దుర మేల్కాంచి
బుడిగిబుడిగి నీట ♦ మునిఁగి మునిఁగి
మొగమునిండ బూది ♦ పూసినమాత్రానఁ
గుదుటఁబడునె మనసు ♦ కుప్పుసామి. ౨౧

ఎంతనీతి కలిగి ♦ యెపుడు వర్తించిన
నెంత నియతికల్గి ♦ యెప్పుడున్నఁ
ద్రాగుబోతు నమ్మ ♦ రాదు నిజంబుగా
ముప్పువచ్చు దానఁ ♦ గుప్పుసామి. ౨౨

రాజు వ్యభిచారి యైనచో ♦ రసికుఁడండ్రు
త్రాగి తందనాలాడుచో ♦ భోగియండ్రు
పాడిదప్పిన మంత్రాంగ ♦ పరుఁడటండ్రు
తప్పు తెలియని లోకులు ♦ కుప్పుసామి. ౨3

కాసులను గూడఁబెట్టిన ♦ దాసికొడుకు
పలుకుబడిగల్గి యందందుఁ ♦ బ్రాకులాడు;
ధనముతోఁ గాని పనులేవి ♦ ధరణిలేవు
మెప్పుకొఱకుఁ జెప్పుటకాదు ♦ కుప్పుసామి. ౨౪

గురునిపజ్జ విద్దెల నేర్చి ♦ కొనక యదియు
నిదియు మూచూచి మురితోడ ♦ నెగిరిపడెడి
చుంబకుని మాటలం జెవిఁ ♦ జొన్పఁబోకు
ముప్పువచ్చును దానిచేఁ ♦ గుప్పుసామి. ౨౫

నవల చదువు, వ్యాజ్యెంబుల ♦ కవిలెకట్ల,
హోట్లు, సిగరెట్లు, సినిమాలు, ♦ చీట్లు, కాఫి,
నూత్న సప్తవ్యసనముల ♦ నుచు వచింత్రు
గొప్ప నీతిశాస్త్రవిదులు ♦ కుప్పుసామి. ౨౬

ఒదిఁగి పనిపాటు లేవియు ♦ నొల్లనట్టి
వాని నెప్పుడు దరిఁజేర్ప ♦ వలదు, దాన
నుభయులకుఁ గీడు వాటిల్లు ♦ చుండుననుచుఁ
జెప్పుచుందురు పెద్దలు ♦ కుప్పుసామి. ౨౭

రఘుకులంబునఁ బుట్టరే ♦ రాముకన్న
గొప్పవారు ! వారల పేరు ♦ లెప్పుడైన
వింటిమే సత్కవికటాక్ష ♦ వితతిచేత
గొప్పవాఁడయ్యె రాముండు ♦ కుప్పుసామి. ౨౮

ఆయమును మించి యెవ్వండు ♦ వ్యయముచేయు
నతనికి సుఖంబు లవలేశ ♦ మబ్బఁబోదు
తుదకుఁ గడగండ్ల పాలౌను ♦ బ్రదుకుతెఱవు
కూడ లేకుండఁ బోవును ♦ గుప్పసామి. ౨౯

గొంటరికి మంచి చేసిన ♦ మంటమండుఁ
గాలియాఱిన సున్నపు ♦ రాలమీఁదఁ
జల్లని జలంబు చల్లిన ♦ సలసలమని
నిప్పుసెగఁ జిమ్ముకైవడిఁ ♦ గుప్పసామి. ౩౦

ఓరుగాలి విసరి ♦ యుయ్యాలలూపంగ
శిరము వంచినట్టి ♦ చెట్లు బ్రదుకు
నిక్కి నీల్గుచెట్లు ♦ నేలమీఁదను గూలుఁ
గుప్పకూరగాఁగఁ ♦ గుప్పసామి. ౩౧

చదువుకొన్న భార్య ♦ సహధర్మచారిణి
యగుటకన్న మంత్రి ♦ యగుట కోరు
జగతి మంత్రి గొప్ప ♦ సహధర్మచారిణి
గొప్ప తెలిసి మెలఁగు ♦ గుప్పసామి. ౩౨

చదువులేని జాయ ♦ సల్లాపములకన్నఁ
జదువుకొన్న జాయ ♦ చలము మేలు;
వీనువిందుగాఁగ ♦ వినవచ్చు నొకమాట
నప్పుడప్పుడైనఁ ♦ గుప్పుసామి. ౩౩

అణఁగి మణఁగియుండు ♦ నటువంటి కులకాంత
భయము భక్తిగల్గు ♦ ప్రియసుతుండు
సంభవించు వాని ♦ జన్మంబు నిజముగా
గొప్పసార్థకంబు ♦ కుప్పుసామి. ౩౪

భార్యచదువు పతికిఁ ♦ బనికివచ్చుచునుండుఁ
గొడుకు చదువుకన్నఁ ♦ గొంతవఱకు
చదువుకొన్న భార్య ♦ సంసారమును దిద్ది
కొనుచుఁ బతికిఁగూర్చుఁ ♦ గుప్పుసామి. ౩౫

తనదు నీలువుఁ గాపాడు ♦ కొనఁగలేని
యతివ భర్త గౌరవముఁ గా ♦ పాడఁగలదె?
యట్టి యామెతోఁ గాపుర ♦ మహరహంబు
కూర్చుచుండుఁ గష్టంబులఁ ♦ గుప్పుసామి. ౩౬

భార్య తనకుఁగాఁ బ్రేమించు ♦ భర్తనెపుడు
భర్త తనకుఁగాఁ బ్రేమించు ♦ భార్యనెపుడు
స్వార్థ మీఁ బ్రేమయందుఁ గ ♦ న్పట్టుచుండు
నొప్పిదముగా విచారింపఁ ♦ గుప్పుసామి. ౩౭

పాతకునిచేత నెప్పుడు ♦ గీతయుండు
మొగముపై వింత వింతఁగఁ ♦ బొట్టులుండుఁ
జిన్నెలివియె మనస్సాక్షి ♦ సన్నగిలిన
యప్పుడు జనాళి కెందును ♦ గుప్పుసామి. ౩౮

ఇంతలోన మాటి ♦ యేయెండ కాగొడ్డుఁ
బట్టువానిఁ జేరఁ ♦ బట్టరాదు
సమయమేగు దేర ♦ సంశయింప కతండు
గొంతు నులిమివైచుఁ ♦ గుప్పుసామి. ౩౯

పరులు చెప్పుమాటఁ ♦ బరికించి చూడక
సమ్మతించువాఁడు ♦ జడుఁడుగాఁడె?
వానినమ్మి యెట్టి ♦ పనిని జేయఁగరాదు
తప్పకుండఁ జెడును ♦ గుప్పుసామి. ౪౦

కూలినాలి చేసి ♦ కొనుచు జీవించువాఁ
డేని నీతిశాలి ♦ యెందుఁ బూజ
నీయుఁ డతనినెపుడు ♦ నెఱనమ్మఁగా వచ్చుఁ
గొఱఁతరాదు దానఁ ♦ గుప్పుసామి. ౪౧

బ్రతికి చెడ్డవాని ♦ వలని నేస్తముఁజేయు
చెడి బ్రదికినవాని ♦ చెలిమి వలదు
వీనియందు నేది ♦ విపరీతమైనను
ముప్పు తప్పఁబోదు ♦ కుప్పుసామి. ౪౨

ఒక్కకొడుకైన ♦ నూరక చెడిపోవు
మకురుతనముచేత ♦ మాటలేల ?
పెద్దయైనకొలఁది ♦ పెద్దగాఁ జింతించుఁ
గొడుకుకొఱకుఁ దండ్రి ♦ కుప్పుసామి. ౪3

ప్రతిభగల్గువాఁడు ♦ పతనంబుఁ జెందిన
మరల పైకివచ్చు ♦ మహితశక్తి
రాలి పడినపూలు ♦ రమణుల క్రొవ్వెద
నొప్పుఁ జూపరావె! ♦ కుప్పుసామి. ౪౪

చేతగామిఁ బనులు ♦ చెడిపోయి నంతనే
విధిని దూరుచుంద్రు ♦ వెఱ్ఱివారు
విధికి దీన నేమి ♦ పెత్తనంబుండునో!
తప్పుమాటగాక ♦ కుప్పుసామి. ౪౫

ముందులున్న నేమి ♦ ముఱువు గొల్పు గులాబి
గొప్పవారుకూడఁ ♦ గొనుచునుంద్రు
కొద్దిదోషమున్న ♦ గుణవంతుఁ బూజింత్రు
తప్పుకుండ జనులు ♦ కుప్పుసామి. ౪౬

సాన నరగఁదీయు కొలంది ♦ చందనంబు
కలయఁ జిమ్ముచు నుండును ♦ గమ్మతావి
సజ్జనుం డిట్టులనె కష్ట ♦ సమయమందు
నొప్పఁ గాంచుచు నుండును ♦ గుప్పుసామి. ౪౭

వారకాంతలఁ బడఁదిట్టు ♦ వారుగలరు
విటులు క్రవ్వింపకుండిన ♦ వేశ్యలెట్లు
చెఱచువారలో పురుషులఁ ♦ జెప్పఁబోరు
కుచ్చితులుగారె వీరెల్లఁ ♦ గుప్పుసామి. ౪౮

విత్త మన్యాయముగఁ గూడఁ ♦ బెట్టి భయము
చేత దానధర్మంబులఁ ♦ జేయు టేల
అడుసు ద్రొక్కఁగానేల ? కా ♦ ల్గడుగ నేల !
యెప్పుడైన లాభము కద్దె? ♦ కుప్పుసామి. ౪౯

పురుషుఁ డన్నిరోగ ♦ ములచేతఁ బీడింపఁ
బడుచునున్న సతికి ♦ వరవుడంబు
నల్ప ధర్మమంట ♦ జగతిలో నిదియెటో
చెప్పఁబోరు జనులు ♦ కుప్పుసామి. ౫౦

కుష్ఠురోగియైనఁ ♦ గుత్సితుండైనను
మగువ తీర్పవలయు ♦ మగనికోర్కె
సతికి హక్కు లేదె ♦ స్వశరీరమును ద్రోచి
కొనఁగ సుంతయైనఁ ♦ గుప్పుసామి. ౫౧

చదువు చెప్పకుండ ♦ జడురాండ్రఁగాఁ జేసి
స్త్రీలఁ దిట్టిపోయఁ ♦ జెల్లుచుండె
దోస మెవరియందు ♦ దొరలాడుచుండెనో
చెప్పఁబోవ రెవరు ♦ కుప్పుసామి. ౫౨

తీరుబాటు కల్గి ♦ తిరునాళ్ళకై పోవు
వింత లుండుననెడి ♦ వెఱ్ఱిచేత
భక్తిచేతఁ గాదు ♦ ప్రాకృత లోకంబు
తిప్పలైనఁ బొంది ♦ కుప్పుసామి. ౫౩

నీచుఁడెపుడు క్రింద ♦ జూచు నైజమగుటఁ
గొండమీఁద నున్న ♦ కొలఁదివాఁగు
నేలవైపుఁ జూచు ♦ నిలిచియుండక యందు
గొణఁగికొనుచు నెపుడు ♦ కుప్పుసామి. ౫౪

అడచిపాటులేని ♦ యనురాగవతి పొందు
మనసుఁ గరఁచఁజాలు ♦ మంచి కవిత
పోరులేని యిల్లు ♦ పుణ్యాత్ములకుఁగాక
కూడ వన్యులకును ♦ గుప్పుసామి. ౫౫

మాతృభాషయందు ♦ మాతృదేశమునందు
మమత లేనివాఁడు ♦ మనుజుఁడగునె?
తగని మమతయుండు ♦ మృగ పక్షిజాతికిఁ
గూడఁ దెలియలేవె ♦ కుప్పుసామి. ౫౬

అత్తవారింట సుఖమెంత ♦ యబ్బుచున్నఁ
బుట్టినింటిపైఁ బేరాస ♦ పొరయుచుండు
సహజ మాఁడుబిడ్డకు నిద్ది ♦ జగతియందుఁ
గ్రొత్తమాట కాదిది యెందుఁ ♦ గుప్పుసామి. ౫౭

వీరుఁ డెప్పుడు రణభూమి ♦ వీడిపోఁడు
పాఱుఁ డెప్పుడు రణభూమి ♦ పజ్జఁబోఁడు
మిండఁ డెప్పుడు సతిప్రక్కఁ ♦ బండఁబోఁడు
కోటి లాభము గల్గినఁ ♦ గుప్పుసామి. ౫౮

చిన్ననాఁట నే బిడ్డకుఁ ♦ జెప్పకున్న
నీతు లవల సాధ్యముకాదు ♦ నిజము; మొక్క
యప్పుడు వదలిపెట్టి యది చె ♦ ట్టయిన వంకఁ
గూడఁ దీయుట తలమానె ? ♦ కుప్పుసామి. ౫౯

వాజ మాన్పరాదు ♦ వసుధాతలంబున
నెట్టివానికైనఁ ♦ బట్టుఁబట్టి
యెవరు తీర్పనేర్తు ♦ రేటివంకల నెల్లఁ?
చెప్పు చూతమిపుడు ♦ కుప్పుసామి. ౬౦

జీవహింస చేసి ♦ జీవింతు ననుకొంటెఁ
జెట్టయెందుఁ గూడఁ ♦ బుట్టఁబోదు
జీవహింస మాని ♦ జీవింపరాదొకో!
కొంత మేలు దానఁ ♦ గుప్పుసామి. ౬౧

మాంసము భుజింప నిచ్ఛించి ♦ మానవుండు
మ్రొక్కు మ్రొక్కుంచు దేవుని ♦ ముందుఁ బెట్టి
గొంతు గోసి యే మృగమునో ♦ కుడుచుచున్నఁ
గోపపడకున్నె దేవుండు? ♦ కుప్పుసామి. ౬౨

కష్టమైన నేమి ♦ కల్ల చెప్పనటంచు
హితుఁడు తప్పకుండ ♦ హితముఁ జెప్పు
పరుఁడు స్వార్థపరుఁడు ♦ మెఱమెచ్చులను జల్కుఁ
గొంకఁ డింతయేని ♦ కుప్పుసామి. ౬౩

మాట పరుసదనము ♦ మార్తురఁ బుట్టించు
మెత్తదనము కూర్చు ♦ మిత్రకోటి
గుడ్లగూబ కేల ♦ కొల్లగా నందురు
తప్పఁ దిట్టువారు! ♦ కుప్పుసామి. ౬౪

బుట్టనున్న పాము ♦ బుసకొట్టి పోఁబోవు
వీలు చిక్కినపుడు ♦ వేగిరించి
సకలభూతములకు ♦ స్వాతంత్ర్య కాంక్షయే
యొప్పు సహజముగను ♦ గుప్పుసామి. ౬౫

నీటిలోని జీవి ♦ నీటిలోఁ జచ్చును
మెట్టనున్న జీవి ♦ మెట్టఁజచ్చు
ఘాతుకుండు చచ్చు ♦ ఘాతుక కృత్యంబు
లుప్పరించుచుండఁ ♦ గుప్పుసామి. ౬౬

ఉప్పతించువాని ♦ కుప్పతిల్లదు మేలు
క్రుళ్ళి క్రుళ్ళి చచ్చుఁ ♦ గొట్టకొనకు
పరులఁజూచి యోర్చి ♦ బ్రదుకువాఁడు శుభంబుఁ
దప్పకుండఁ బొందుఁ ♦ గుప్పుసామి. ౬౭

కారణములేక కుజనుండు ♦ కష్టపెట్టు
నెట్టివారల నేనియు ♦ నెండ్రి యొకటి
చేనిలోనుండి మెల్లగాఁ ♦ జేనిపైరు
కొఱికి వైచెడి కైవడిఁ ♦ గుప్పుసామి. ౬౮

సానఁ బట్టినయపుడె వ ♦ జ్రముల కాంతి
ప్రజ్వలితమగు నాప్రకా ♦ రంబె కష్ట
సమయమందె ప్రకాశించు ♦ శౌర్యరాశి
గురుతరంబైన శౌర్యంబు ♦ కుప్పసామి. ౧౯

అంత్యనిష్ఠురంబునకన్న ♦ నాదినిష్ఠు
రంబు మేలుగావునఁ దత్త ♦ రంబు లేక
యున్న దున్నట్టుగాఁ జెప్పు ♦ చుందురు బుధు
లొప్పమిని లెక్కపెట్టక ♦ కుప్పసామి. ౨౦

ఎన్ని రసములున్న ♦ నేమి రుచించును
నుప్పులేని కూర ♦ చప్పనగుచుఁ!
గోటి గుణములున్నఁ ♦ గొఱగావు నీతి యొ
క్కండు లేకయున్నఁ ♦ గుప్పసామి. ౨౧

తలలు గొఱిగించి కావి బ ♦ ట్టలనుగట్టి
మెడల రుద్రాక్షమాలిక ♦ లిడినయంత
ముక్తి వచ్చునె నిస్సంగ ♦ బుద్ధిలేక
కుమతి మాటలచే నేమి ♦ కుప్పసామి. ౨౨

తప్పుఁ దెలిసికొన్నఁ ♦ దత్‌క్షణమే సజ్జ
నుండు దిద్దుకొనఁగ ♦ నూలుకొనును;
గఱతలాఁడు దానిఁ ♦ గప్పిపుచ్చఁ గడంగుఁ
గుటిలబుద్ధిచేతఁ ♦ గుప్పుసామి. ౨౩

చచ్చిపోయిన వెంటనే ♦ జన్మమెత్తు
జీవి కుడువఁ గర్మమటంచుఁ ♦ జెప్పుచుందు
రట్టులైనచోఁ బితృలోక ♦ మెట్టువచ్చుఁ ?
కుటిలజనసృష్టి గాదొక్కొ ♦ కుప్పుసామి. ౨౪

చచ్చిపోయిన వాని కే ♦ సరణిఁ జేరఁ
గలవు పిండములు నివాప ♦ జలముకూడ
నావులును భోక్తలును దృప్తు ♦ లగుటకొఱకుఁ
గూర్చి పెట్టిరి గాకేమి ♦ కుప్పుసామి. ౨౫

ముక్కు మొగముఁ జెక్కి ♦ మూలవిరాట్టంచు
నొక్క రాయిఁదెచ్చి ♦ యుంచి గుడులఁ
గూడు గుడ్డలిచ్చి ♦ కొల్తురు ప్రజలెల్లఁ
గొంటెపనులు గావె ♦ కుప్పుసామి. ౨౬

మండి వెలుఁగుదాని ♦ మన దీపమని చెప్పి
ముద్దుపెట్టుకొన్న ♦ మూతిఁగాలు;
మూర్ఖుఁడైనవాని ♦ పొందు చేకూర్చును
ముప్పు దప్పకిటులఁ ♦ గుప్పుసామి. ౨౭

కొడుకు కొమ్మలనుచుఁ ♦ గూడుగుడ్డలనుచు
నిల్లు వాకిలనుచు ♦ నెగిరిపడుచుఁ
పాపమనక యెవఁడు ♦ వర్తించు వానికిఁ
గొంప మునిఁగితీరు ♦ గుప్పుసామి. ౨౮

పొట్టివాని కుండుఁ ♦ బుట్టెడు బుద్ధులు
పొట్టివాని నమ్మఁ ♦ బోకు మెపుడు
పొట్టివాఁడు గాదె ♦ పొడవడంచె బలిని
గూటపథముఁ ద్రొక్కి ♦ కుప్పుసామి. ౨౯

రకరకంబులైన ♦ రంగువల్వలు మేనఁ
గట్టినంత రాదు ♦ గౌరవంబుఁ
అంగకములఁ గప్ప ♦ గంగెద్దునకుఁ జాలఁ
గప్పడములు లేవె ♦ కుప్పుసామి. ౩౦

కులములోన నొక్క ♦ కుజనుండు పుట్టినఁ
గులము చెడును దానఁ ♦ గులకలంక
మందువల్ల నెంత ♦ మంది నిర్దోషులో
గోడు గుడుచుచుంద్రు ♦ కుప్పుసామి. ౮౧

ఎంతమంచివాని ♦ నేనియుఁ జిటికలోఁ
జెడ్డవానిఁ గాఁగఁ ♦ జేయవచ్చు
బందుకట్టి బైసి ♦ వదలుచుఁ బదిమంది
కుచ్చితములు పల్క ♦ కుప్పుసామి. ౮౨

ఆశ కంతంబు లేదెందు ♦ నాశ వదల
కున్నఁ బ్రాణికి సౌఖ్యంబు ♦ సున్నయగును
దృష్టిఁ గాంచనేరనియట్టి ♦ తృష్ణ నరుని
కెప్పు డొప్పుగాఁబోవదు ♦ కుప్పుసామి. ౮3

చదువు సాములు చెప్పించి ♦ సంస్కరింప
కెంతొ విత్తంబు గడియించి ♦ యిచ్చు తండ్రి
పుత్రునకు నెందు భీషణ ♦ శత్రువంచుఁ
జెప్పుదురు పండితోత్తముల్ ♦ కుప్పుసామి. ౮౪

ఆఁడుదాని యీలు ♦ వంతరించిన మీఁద
నెట్టివంశమందుఁ ♦ బుట్టియున్న
గ్రుడ్డిగవ్వకైనఁ ♦ గొఱగాక పోవు, నీ
యొప్పులేని జగతిఁ ♦ గుప్పుసామి. ౮౫

సంశయించు భర్త ♦ సాహచర్యముఁ జేయ
సాధ్యపడునె యెట్టి ♦ సాధ్వికైన ?
సీత భూమిఁ జొచ్చె ♦ శ్రీరామచంద్రునిఁ
గూడి యుండలేక ♦ కుప్పుసామి. ౮౬

పెండ్లియందు నొక్కరి కేల ♦ పెత్తనంబు!
కష్టసుఖము లందలి పాలి ♦ కాపులగుటఁ
బెండ్లికూఁతురు కొమరుండు ♦ పెండ్లిఁ జేసి
కొనఁగవలెఁగాని నిజముగాఁ ♦ గుప్పుసామి. ౮౭

మ్రొక్కుగల దదిచెల్లింపఁ ♦ బోదు మంచు
గొండలెక్కి యేరుల దాఁటి ♦ కొట్టకొనకు
జుట్టునిత్తురు దేవుండు ♦ క్షోభపడఁడె
కూఁకటుల చిక్కుఁ దెలియక ♦ కుప్పుసామి. ౮౮

అక్షమాలఁ గుంభజుఁడు పెం ♦ డ్లాడె నందు
రక్షమాల పుట్టింటివా ♦ రనినయెడల
ముట్టరాదందు రిదియేమి ♦ చిట్ట! విప్ర
కోటి కిది చెల్లిపోయెఁగా ♦ కుప్పసామి. ౫౯

తిరిపెమెత్తి జీవించెడి ♦ దేబెకున్న
యాత్మసంతుష్టి కలదె ధ ♦ నాఢ్యునకును?
ధనము సంతుష్టి నీదు వి ♦ ద్యాధనంబొ
కూర్చు నాత్మసంతుష్టిని ♦ కుప్పసామి. ౬౦

వయసు చెల్లుచున్నంత లా ♦ వణ్యముడుగు
నుడుగనిది యొక్క శీలంబు ♦ పడతి కెప్పు
డుడుగకుండంగ వర్ధిల్లు ♦ చుండుఁ గాన
గుణములేని చెలువయేల ♦ కుప్పసామి? ౬౧

తలలు మాడుచున్నఁ ♦ దమపాదములఁ బట్టి
కొన్నవారి కిచ్చు ♦ గొప్పనీడ
పాదపంబు లిట్లె ♦ పండితు లిత్తురు
కోర్కె లాశ్రితులకుఁ ♦ గుప్పసామి. ౬౨

దేహపాటవంబు ♦ దిగజారు కొలఁదిని
విషయవాంఛ మిగులఁ ♦ బెఱుగుచుండు
నందుచేత దేహ ♦ మారోగ్యమున నుంచి
కొనుట మేలు ప్రజకుఁ ♦ గుప్పుసామి. ౯౩

పాడిపంటలేక ♦ పశుసంపదయు లేక
కాయకష్టము పడు ♦ కడిమిలేక
బ్రదుకుచుండునట్టి ♦ రైతుబిడ్డల నమ్మఁ
గూడదెపుడు సుంత ♦ కుప్పుసామి. ౯౪

మేనమామ పోల్కి ♦ మేనత్త చాలిక
యనెడి సంప్రదాయ ♦ మధిగమించి
పెండ్లిచేయునపుడు ♦ పెద్దగా యోజించి
కులము నెమకవలయుఁ ♦ గుప్పుసామి. ౯౫

కానిడబ్బు చేతఁ ♦ గల్గువాఁ డెట్టివాఁ
డయిన గౌరవంబు ♦ నందుటెఱిఁగి
పరువుఁగోరి బ్రదుకు ♦ వాఁడెందు ద్రవ్యంబుఁ
గూడఁబెట్టవలయుఁ ♦ గుప్పుసామి. ౯౬

చిడిపిరాళ్ళగనిని ♦ బొడఁగట్టు వజ్ర మొ
క్కొక్కమాటు గాన ♦ నోర్మిగల్గి
వెదకి వెదకి చాల ♦ వెడవంగడమునుండి
కొనఁగవచ్చుఁబిల్లఁ ♦ గుప్పసామి. ౯౭

పెట్టుపోతలున్న ♦ యట్టి వంగస మెందుఁ
గుతిలపడదు ధనము ♦ కొఱఁతఁబడినఁ
గానఁ బెట్టుపోత ♦ లానుగా జరుపుట
కూర్చుచుండు మేలు ♦ కుప్పసామి. ౯౮

జంతుజాలమునకుఁ ♦ జావు నై జమగుటఁ
దెలివి గల్గువారు ♦ తెలిసికొనుచు
దానధర్మములను ♦ దనివోవఁ జేతురు
కూర్చు శుభము దానఁ గుప్పసామి. ౯౯

తల్లి కప్పిపుచ్చుఁ ♦ దనబిడ్డలందున్న
యెన్ని తప్పులైన ♦ నెట్టివైనఁ
దలకుఁ జుట్టుగుడ్డ ♦ తనకున్న చిఱుగులఁ
గప్పిపుచ్చునట్లు ♦ కుప్పసామి. ౧౦౦

కైతకైదువన్న ♦ భీతిపడు జగంబు
కైదు వున్నయప్లె ♦ కవితయున్నఁ
గవుల నాశ్రయించి ♦ కడచన్నరాజులు
గొప్పవారలైరి ♦ కుప్పసామి. ౧౦౧

కలద లిన్నికూర్చి ♦ కవిరాజు వచియించెఁ
బరులకొఱకుఁ గార్య ♦ పరులకొఱకుఁ
జిక్కువచ్చినపుడు ♦ చిక్కుదీరును దీని
విప్పి చదువుకొన్నఁ ♦ గుప్పసామి. ౧౦౨



# ధూర్తమానవా

ఏఁ బదునాల్గులోకముల
సృష్టియొనర్చుచుఁ బెంచి పిమ్మటన్
దూబవలెన్ హరింతు నని
దొంగనుడుల్ వచియించు చుంటివే!
యేఁబదిమాట లేమిటికి?
ఇట్టిప్రచారము మానకున్నచో
గూబలు సాఁగఁదీసెదను
గూయకు మిట్టివి ధూర్తమానవా!

ఎవ్వరు చూచినారు సృజి
యింపఁగ నీ పదునాల్గులోకముల్
సువ్వన సువ్వి సువ్వి యను
చొప్పెకదా! యొకఁడైనఁ జూచెనే
దవ్వులనుండియైన నొక
దానిని నైన? వృథా ప్రగల్భముల్!—
నవ్వుల పాలుఁజేసెదవె
నన్నిటులాడుచు ధూర్తమానవా!

ప్రతివర్షంబును నా వివాహ మను పే
రన్ బెక్కుచందాల దు
ర్మతి చందాలు వసూలుచేసి ప్రతియూ
రన్ గజ్జకట్టింతువే !
3 గతి యీమాత్రములేదె నాశరయ ! నేఁ
గావించుకోలేనె ? యీ
గతి నన్నీవు పరాభవించుటకు సం
కల్పింతువే మానవా !

కాపురముండ నిల్లు, నడ
కత్తెరలోఁ బడియుండఁ బెండ్లమున్,
మాపులు కునుకఁగాఁ బడక
మంచము, నెక్కఁగ నెక్కిరింతలున్,
4. సాపడఁ బైడికంచమును
జక్కఁగఁగూర్చి యుపన్యసింతువే ?
నీపనిఁ బట్టెదన్ వినుము
నీవిది మానవ ధూర్తమానవా !

కొస కేమానో యెఱుంగకుండ నుసితోఁ
గోణంగివై నీవు నీ
5 పుసికన్నుల్ మసిముక్కు దేబెమొగమున్
బువ్వాడు పెస్ బోరెమున్

తొాసినోరున్ గలిగించి వంచకుఁడవై
దుర్జాతి, నన్నొక్క మా
నిసినిం జేసెదవే! మనుష్యునివలెన్
నేనుంటినే మానవా!

కాలుంజేతులు ముక్కు మోములును చం
కల్ చన్నులున్ బేర్లు నీ
కేలా యున్నవో; నాకు నట్లేకలవా?
యీరీతిగా నన్ను నీ
6 వేలా వర్ణనచేసినాఁడ వకటా!
యెందాక సైరింతు? నిన్
పాలార్తున్ మునుమున్న చెప్పితిని నీ
పాట్లన్నియున్ మానవా!

గుడులున్ గోపురముల్ కుశీలవుఁడవై
కూర్పించి చందాలతో
మడిమాన్యంబులు నాదు పేరునన ని
7 ర్మాణంబు గావించుచున్
వడపప్పున్ బెరవారి కిచ్చెదవె! నీ
భావంబునం దేమి గీ
ల్పడఁగా నేర్చెడి? చెప్పు మింతటి దివా
లాఖోరువే మానవా!

వేదము లెట్లు బ్రహ్మముఖ
వీథులనుండి హరింపఁగాఁ బడున్ ?
పాదలి సోమకాసురుఁడు
వచ్చి త్రయిన్ హరియించె నంచు నే
8 చీదరఁ బొందకుండ చోఱ
చేఁపను జేసితివే ననున్ — సరే !
నీదయమీద నా బ్రదుకు
నిల్చెనె చెప్పుమ ధూర్తమానవా !

బలి యేపాపముఁ జేసినాఁ డతనిపై
వైరంబు నాకేల ? త
ద్బలి రాజ్యంబు హరింప వంచకుఁడనై
9 ధర్మంబుఁ బోద్రోసి దో
ర్బలహీనుండగు నింద్రుఁ బ్రోవ నవతా
రం బెత్తినా నంచు లో
కులు నమ్మన్ వచియింతు వింకయిన బొం
కుల్ మానవా ? మానవా !

పరులను, ధర్మదూరులను,
బంధురపాపనిమగ్నచిత్తులన్
గరుణను గాచి ప్రోచుటకు
గా ముఱితో బలిచక్రవర్తినిన్

తెరిపెము నెత్తినాఁడ నని
దేబిరిగొట్టుమొగంబ, యెల్లెడన్
నిరతము చాటుచుండెదవె!
నీపనిఁ బట్టెద ధూర్తమానవా!

తనువెల్లఁ గుల పెట్టి జీర్ణసుఖ రు
గ్దద్రుదువ్యథాపీడచే
త నహోరాత్రులు కామతృప్తిఁ గొఱకై
దారాడు స్వర్లోక నా
థుని పక్షంబయి దానశీలుని మహా
త్ముప్రజ్ఞున్ బలిఁ సత్యవా
క్యనిరూఢున్ బొరియించినా ననుచుఁ బ
ల్కన్ జూతువే మానవా!

ఒక్కఁడు తండ్రిఁ జంపెనని
యోరిమి లేకయె గండ్రగొడ్డటన్
జక్కడగింప ధర్మమగు
నా కులమంతయు! దీని జేయ నే
నొక్కఁడనే కనంబడితి
నో! యిటువంటివి పూర్వమందు నే
దిక్కులనేని విన్పడెనె?
తిక్కవదల్చెద ధూర్తమానవా!

ఉడుగక తొల్లి పెండ్లమును
నొక్కతె నామెడ కంటఁగట్టి యా
బిడ నెవఁడో హరించె నని
వెంగలిమాటలు చెప్పి యామెకై
13 మెడ తెగకుండ బావురని
యేడ్చితినంచును నెన్నిరోజులో
బడబడ పెద్దగ్రంథములు
వ్రాసితివేమిర ? ధూర్తమానవా !

మిడిమేలంబుగఁ దెచ్చిపెట్టితివిగా
మేనత్తతోఁ గూటమిన్
బడి మువ్వంకల ముండతోడ మథురా
14 పట్నంబులోఁ గూటమిన్
మెడకుంగట్టితి వెంతవాఁడవుర ! నీ
మిట్టాటలన్ మానవా ?
కడికండల్ తెగఁగోసివైచెదను గా
కశ్రేణికిన్ మానవా !

అవతారంబులనెత్తి చేయగల న
న్యాయంబు లన్నింటి నే
నవతారంబుల నెత్తకుండ మఱి చే
యన్ శక్తి లే దంచు న

న్నవమానించితి వింతకాల మిటు ? ని
న్నాపాదమస్తంబుగా
15 నివురుంజేసెద నెవ్వరడ్డపడగా
నీ కుండిరో మానవా!

స్మృతులన్ వ్రాసితి నందు; వాస్మృతులలోఁ
జిత్రించి శ్రుత్యర్థముల్
ప్రతిపాదించితినందు; వయ్యది నిజం
బా? యెంతకాలంబు దు
16 ష్కృతి సాగింతువు, లోకవంచనములన్
జేయింతువో, చేతువో
పతితాత్మా, యిఁకనైన యీ వెడఁగు త్రో
వల్ మానవా? మానవా!

కలలోఁ గన్పడుచుండు బట్టబయలన్
గన్పట్ట రాకుండు గ
డ్డలు గ్రంథంబులఁ జెప్పఁ గట్టెదుటఁ బ్ర
17 త్యక్షంబుఁ జెప్పండు లో
కులు కల్లోలపడంగ నీగతిని ట
క్కుల్ చెప్పు మాయావికిన్
తలతిక్కన్ వదలింతు నీపయిని చి
త్తభ్రాంతిపో మానవా!

ఈ టకటొంకు లేమిటికి?
నిల్లును వాకిలిఁ గట్టిపెట్టి యే
కేటను బెండ్లి సేయుమని
యే నెపుడైన నను గోరియుంటినే!
18 చీటికి మాటికిన్ బరుల
జేబులు గొట్టుట ధర్మమార్గమే?
ఏటికి నీయబద్ధ మర
రే! యిఁక సాగునె? ధూర్తమానవా!

బొక్కెడుకూడు పట్టుమని
పొట్టకు తింటివె యొక్కపూటయేన్?
జక్కగ నొంటినిండ నొక
19 జానెడు గుడ్డను గప్పుకొంటివే?
ఒక్కటియేని మ్రుచ్చిలిక
యుంచితివే? యిఁక నీదుపాటు లే
నక్కయుఁ గుక్కయున్ బడదు;
నాపలుకుల్ విను ధూర్తమానవా!

పొక్కిలిగడ్డలేక, తన
పొయ్యికిఁ గట్టెలు లేక, మంటకున్
బిక్కనఁ గుండలోనికిని
బియ్యపునూకలు లేక, గంజిలో

లెక్కకు నుప్పుగల్లయిన
లేక, కృశించెడి పేదవానికిన్
తెక్కలు డుల్చి సిల్లుల హ
రింతువె చెప్పర, ధూర్తమానవా !

మరణపు శయ్యమీఁద నొక
మారయినన్ నను దప్పకుండసం
స్మరణము చేసినంతటనె
స్వర్గము వచ్చున టందు; వేగతిన్
బొరయును ? నిల్లె నీ వెపుడు
బొంకుచునుందువు దీనికై నినున్
గటకట గొంతు కోసెదను
కానివి చెప్పకు ధూర్తమానవా !

ఏ నొకజాతికూడు భుజి
యించుచు మిక్కిలి తక్కజాతులన్
హీనముగాఁగఁ జూతు నని
యెవ్వరు సెప్పిరి నీకు వంచకా !
మానవు లందఱున్ సరిస
మానులు గారొకొ నాకు? మాయురే !
మానక నీవ యిట్టి యవ
మానముఁ జేతువె ధూర్తమానవా !

త్వరపడకుండ సంజపడు
దాఁకను తప్పుపనుల్ పొనర్చి పై
బొరుగున నున్న తోఁటలను
బూవులు మ్రుచ్చిలి కోసి తెచ్చి నా
23 శిరమునఁ బోసినంతటనె
చేసిన పాపము లొక్కసారిగా
మఱచెదునట్టి వెంగలినె
మానక యిట్టివి ధూర్తమానవా!

పనులను, జెట్టుచేమలను,
బక్షితతిన్, గ్రిమికీటకాదులన్
బుసుకున దాకినంతఁ దల
పోయవు స్నానముమాట; కాని, మా
24 నిసి నినుఁదాకినంతఁ దల
నిండుగ స్నానము ధర్మమార్గమే!
ముసిముసినవ్వు నవ్వెదవు.
మోరెగ బట్టుక ధూర్తమానవా!

బొచ్చు నొసంగి మెట్లు పరి
పూర్ణమనోరథసిద్ధిఁ బొందగా
వచ్చును! బిచ్చివాఁడనని
భావమునం దలపోయుచుంటివా!

పుచ్చును నీదుపాపములు
పోరచి మానుమ యిట్టి వానినిన్;
25 బొంచ్చెము లిట్లుచెప్పి ప్రజ
మోసము చేయకు ధూర్తమానవా!

ఒక దేవాలయమందు స్త్రీలకు రహ
స్యోత్సాహివై బోధముల్
నికరాదాయముతోడ జోడుచెవులున్
నిండించుచున్నావటే!
26 అకటా కొంపల నెన్ని దీసితివొ? యు
త్యాచారముల్ సల్పి; నీ
మొకమున్ రాసెద మానకున్న యెడలన్
ముమ్మాటికిన్ మానవా!

బిడ్డలకోసరమ్ము విల
పించెడి యా జవరాండ్రతోడుతన్
బిడ్డలు తప్పకుండఁ బ్రభ
వించెదరంచు సమాదరంబునన్
27 గడ్డముపట్టి "గర్భగుడి"
గర్భముఁ జేర్చుదువట్టెరేల నో
వెడ్డరి! నాకు మంచి పని
పెట్టితి వింతకు ధూర్తమానవా!

వాజను మానకున్న నప
వాదులు; తప్పవు శృంగభంగముల్;
రోజులు నీకుఁ జాల విసి
రో! జులు మింతకు మానకున్నచోఁ
28 బాజివియాదు వీవు నగు
బాటు ఘటిల్లును; నింక మీఁద నీ
పోజును జూచి మోసపడి
పోవుట గల్గదు ధూర్తమానవా!

తిరిపెము నెత్తియెత్తి యతి
దీనతఁ దిర్గుచు జోలి బట్టుచుఁ
తిరుపతికొండ మీఁది కెగ
దేకుచు నచ్చట చెప్పుదెబ్బ లీ
29 వారువుగఁ దిన్న లేశముప్ర
యోజన ముండదు ధర్మమార్గమున్
బిటేఁదికిఁ ద్రోసిపుచ్చి పర
పీడకుఁ బూనిన ధూర్తమానవా!

తిరుపతిఁ బుట్టి; రంగపురి
తెన్నుల వర్ధిలి; కాశిలోపలన్
మరణము పొందినప్పటికి
మారదు కర్మఫలానుభూతి; నీ

వెరిగియు దీని స్వార్థరతి
నెల్లవిధంబుల నెంతమందినో
30 పురపుర నెల్లవేళలను
మోసముఁ జేతువె ధూర్తమానవా!

ఇతరులఁ బర్వుతో బ్రదుక
నిచ్చుట నెన్నఁడు నేర్చికొందు వా
యతమగు నీ ప్రపంచసుఖ
మన్నది యొక్కటె నీ సుఖంబుగాఁ
31 బ్రతిదినమున్ స్మరించు సమ
భావము నెన్నఁడు నేర్చికొందు వు
న్నతిఁ గనుచుండి నీ ప్రజల
నారతమున్ నినుమెచ్చ మానవా!

చేసినవేవో చేసితివి
చెన్నటివై; యవి నేను సైరణన్
జేసితి; నింకముందయినఁ
32 జేసిన తప్పుల దిద్దుబాటుకై
గాసిలియైన యత్నములు
గట్టిగఁ జేయక యూరకున్నచో
వేసరఁబోక కట్టి కుడి
పించెదఁ దప్పదు ధూర్తమానవా!

నే వచ్చి నీకుఁ గలలో
వావిరి చెప్పినది యెల్ల వ్రాయుటచేతన్
73 నీవే ధన్యుఁడ వైతివి
రావోయీ ! త్రిపురనేని రామస్వామీ !



# విడి పద్యాలు

పైగా నాతనినే విమానముపయిన్
స్వర్గంబు గొంపోయి త
ద్భోగావాప్తిని గూర్చినాఁడ నని సు
ద్దుల్ చెప్పుచున్నాఁడవా!
జాగీరిచ్చెనె యే ప్రభుండయిన రా
జద్రోహికిన్ స్వర్గమా!
నీ గాండ్రింపులు గట్టిపెట్టు నిఁకనే
నిన్ బూనవా! మానవా!

ఎడ్డెతనంబుఁ జూపెదవె!
యెంతని నే సహియింతు నిన్ను; నీ
కడ్డము వచ్చెనంతటనె
యాతఁడు ధర్మవిదూరుఁడౌనె! పెన్
గడ్డము లేకయున్న నెటు
కాఁగలఁడయ్య ఋషీంద్రుఁ డెందు! నీ
నడ్డి విఱుంగు నింకపయి
నన్ మతిదప్పిన ధూర్తమానవా!

ఆ యాచార్యుఁ డెవండో తెల్పవుగ య
త్యాచారముం జల్పుచున్
కాయంబెల్లను రాజయక్ష్మయను రో
గంబందుటన్ గ్రుళ్లి వే
యాయాసంబునఁ దూలుచున్న తఁడు నా
యాచార్యులం దొక్కఁడా ?
నాయాజ్ఞా పరిపాలురం దొకఁడ ! నన్
వంచింతువా ? మానవా !



# వీరగంధము

వీరగంధముఁ దెచ్చినారము
వీరుఁ డెవ్వాఁడో తెల్పుఁడీ!
పూసి పోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో !!

తెలుఁగు బావుట కన్ను చెదరఁగ
కొండవీఁటను నెగిరినప్పుడు
తెలుఁగువారల కత్తిదెబ్బలు
గండికోటను కాచినప్పుడు

తెలుగువారల వేఁడి నెత్తురు
తుంగభద్రను గలిసినప్పుడు
దూరమందున నున్న సహ్యజ
కత్తినెత్తురు కడిగినప్పుడు

ఇట్టి సందియ మెన్నఁడేనియుఁ
బుట్టలేదు రవంతయున్;
ఇట్టి ప్రశ్నల నడుగువారలు
లేకపోయిరి సుంతయున్.

నడుముగట్టిన తెలుఁగుబాలుఁడు
వెనుక తిరుగం డెన్నఁడున్,
బాసయిచ్చిన తెలుఁగుబాలుఁడు
పాఱిపోవం డెన్నఁడున్.

ఇదిగో! యున్నది వీరగంధము
మై నలందుము మైనలందుము;
శాంతిపర్వముఁ జదువవచ్చును
శాంతిసమరం బైనపిమ్మట.

తెలుఁగునాఁటిని వీరమాతను
జేసిమాత్రము తిరిగి రమ్మిఁక,
పలుతుపాకులు పలు ఫిరంగులు
దారి కడ్డము రాకతప్పవు—

వీరగంధముఁ దెచ్చినారము
వీరుఁ డెవ్వఁడో తెల్పుఁడీ!
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో!!

## తెలుఁగువారలు పిరికివారా!

కంచికోటలు కంచుతల్పులు
ఖంగు ఖంగున మ్రోఁగునప్పుడు
తంజ నగరపు కోటగోడలు
చెంగు చెంగున నెగురునప్పుడు
తిరువటంబునఁ జేర సేనలు
కెవ్వు కెవ్వున నఱచునప్పుడు,
మధుర కోటయగడ్తలన్నియు
జివ్వుజివ్వున దూఁకునప్పుడు,

తెలుఁగువారలు పిఱికివారలా
తెలుగుబిడ్డా! తెలుసుకొనుమా!

తెలుఁగువారల యీటెపోటులు;
తెలుఁగువారల నీటుగోటులు,
తెలుఁగువారల పోటుమాటలు
తెలుఁగువారల యేటుపాటులు
తెలిసి మెలఁగిన గోలుకొండ
విజాపురంబును నాముదాపురి

నడిగిచూడుము, యేమి చెప్పనో
తెలుఁగువారల ప్రాంతకతలన్:

తెలుఁగువారలు పిఱికివారలొ
తెలుగుబిడ్డా! తెలిసికొనుమా !!

ఓరుగంటిని దండువిడిసిన
దేవగిరి యాదవనృపాలుని
ఓరగంటను గాంచి యప్పుడె
దేవగిరి దర్వాజవఱకున్
తఱిమి తోల్కొని పోవఁబోవఁగ
పూరిమేయఁగ నభయమిచ్చిన
తెలుఁగుదొరసానైన రుద్రమ
దేవి కీర్తిని లోక మెఱుఁగదె.

తెలుఁగువారల యోఁదుబిడ్డల
తెగువ బిగువులు తెలిసికొనుమా !!

వీరరసమే వెల్లివిరియఁగ
వెనుక తగ్గని పల్లెనాఁటన్
కాలిబంటుల కాలిక్రిందను
నలఁగిపోయిన దండు బాటల్

అరులమూఁకను జెఱలఁబెట్టిన
అరిది యగు మాచెఱలకోటన్
పేరుగ్రుచ్చియుఁ బిలిచి యడుగుము
తెలియవచ్చును తెలుఁగుప్రేటున్
ప్రాఁతకతలన్ బాడకుండినఁ
దెలుఁగుబిడ్డా! పరువు దక్కునె!

ఢిల్లిసురతాన్ ఫౌజుదారులు
ముట్టడింపఁగ మూఁడుమాఱులు
తురక కత్తులు దాఁకినంతనె
చుంయి చుంయన గంటు నెత్తురు
పొంగి పొరలఁగ నోరుగంటను
ద్రోలివేయవె ఢిల్లి దాఁకను
తెలుఁగుకత్తులు తురకబిడ్డలఁ
దెంపు పెంపున నెల్ల దాఁటఁగ
పెద్దవారలఁ బిలిచి యడుగుము
తెలియఁబఱుతురు తెలుఁగుధాకను

రెడ్డిదొరలును కమ్మదొరలును
వెలమదొరలును కాపుదొరలును

రాచదొరలును; మొక్కవోవని
పౌరుషంబులఁ బోరుసలిపియు
గౌతమీనది కృష్ణవేణిని
తుంగభద్రను సహ్యజానది
నెత్తు రోలికిరి, కాలవశమునఁ
గత్తి గడిగిరి, మూలఁ బెట్టిరి

ఇంతమాత్రనె మఱచిపోకుము
తాత తండ్రుల వన్నె చిన్నెలు!

మఱచిపోకుము మఱచి పోకుము
మన్నెదొరలను తెల్గునాఁటను
మఱవకుండఁగ మూఁడుప్రొద్దులఁ
బాడుచుండుము వారిపాటను,
తేటమాటలఁ దెలియఁ జెప్పుము
దిక్కులన్నియు మాఱుమ్రోఁగిన
తెలుఁగువారల పేరుపెంపును
దెలియకుండఁగ నుండఁబోకుము,

తెలుఁగుబాలుఁడ యింపు నింపుము
తెలుఁగుబాలుఁడ పేరు పెంపుము!!

# మందేరా!

బ్రహ్మపురము మందేరా
పర్లాకిమిడి మందేరా
కాదని వాదుకువస్తే
కటకందాఁకా మందేరా!
బస్తరెల్లా మందేరా
జయపూరంతా మందేరా
కాదని వాదుకువస్తే
నాగపూర్ దాఁకా మందేరా!
గోలకొండ మందేరా
తెలింగాన మందేరా
కాదని వాదుకువస్తే
నైజామంతా మందేరా!
చెన్నపురము మందేరా
చంగల్పట్టు మందేరా

కాదని వాదుకువస్తే
తంజావూరును మందేరా !
బెంగుళూరు మందేరా
బళ్ళారి మందేరా
కాదని వాదుకువస్తే
కన్నడ మర్ధం మందేరా !
దేవికోట మందేరా
పుదుక్కోట మందేరా
కాదని వాదుకువస్తే
కాండేదాఁకా మందేరా !

# తెలుఁగుజోదులు

గౌతమీనది, కృష్ణవేణియు
తుంగభద్రయు, సర్వదా
జీవనదులై యెండిపోవక
యెల్లకాలము పాఱుచుండ,
బీళ్ళ నన్నిటిఁ బంటపొలములు,
పండ్లతోఁటలు చేయుచుండ,
దెల్గుదేశం బతి సుభిక్షము
గా నొనర్చును సర్వదా
    తెలుగుబిడ్డా! మఱచిపోకుర
    తెలుఁగు దేశము పురిటిగడ్డర
    కొక్కొరోకోపాటఁ బాడర
    తెలుఁగువారల మేలుకొల్పర !!

రెండు కోట్లకు మించియుండిన
తెల్గువారల నక్కటా !
చీల్చివైచిరి, నాల్గు దెసలకుఁ
జిమ్మివైచిరి నేఁటికిన్,

కొంతమంది నిజామురాష్ట్రము
నందుఁ జిక్కిరి చేలలై,
కొంతమందియు కన్నడంబున
నుండి పోయిరి దీనులై.

తెలుఁగుబిడ్డా! మఱచిపోకుర
తెలుఁగుదేశము పురిటిగడ్డర
కొక్కొరోకోపాటఁ బాడర
తెలుఁగువారల మేలుకొల్పర !!

పూర్వ మెప్పుడో యెదురులేకయె
ద్రవిడదేశము మీఁదికిన్
జైత్రయాత్రలు సల్పియుండిరి
తెల్గుబంటులు జోదులై,
తెలుఁగుదేశం బాక్రమించిరి
యఱవవారలు నేఁటికిన్,
మెల్ల మెల్లఁగఁ బ్రాఁకులాడుచు
దిడ్డికంతల దూఱుచున్,

తెలుఁగుబిడ్డా! మఱచిపోకుర
తెలుఁగుదేశము పురిటిగడ్డర
కొక్కొరోకోపాటఁ బాడర
తెలుఁగువారల మేలుకొల్పర !!

లెమ్ము లెమ్మిఁక నడుముగట్టుము
తెల్గువారల నెల్ల నీ
వొక్క రాష్ట్రమునందుఁ గూర్పఁగ
గట్టియత్నముఁ జేయుమా ?
అన్యు లెవ్వరు నడ్డఁజాలరు,
నీ మనోరథ సిద్ధినిన్
బడయనేర్చెద వచిరకాలము
నందె పేరు ప్రతిష్ఠతో

తెలుఁగుబిడ్డా! మఱచి పోకుర
తెలుఁగుదేశము పురిటిగడ్డర
కొక్కురొకో పాటఁబాడర
తెలుఁగువారల మేలుకొల్పర!!

ఒడ్డె బందెలదొడ్డిఁ ద్రోలిరి
తెల్గువారలఁ గొందఱన్,
మిగిలియుండిన వారినెల్లర
నఱవవారల కాళ్ళపైఁ
గూలఁద్రోసిరి, కేరడంబులు
కుచ్చితంబులు పల్కుచున్,
మఱువరాని పరాభవంబును
గల్గఁజేసిరి, యెల్లరున్.

తెలుఁగుబిడ్డా ! మఱచిపోకుర
తెలుఁగు దేశము పురిటిగడ్డర
కొంకొక్కరోకోపాటఁ బాడర
తెలుఁగువారల మేలుకొల్పర!!

తెల్గువారల పేరు మాసెను
తెల్గునాఁటను నేఁటితోఁ
తెల్గువారల కెల్ల నమ్మడి
దేశ మొక్కటి లే దహో!
తెల్గువారల ధాక యెఱిఁగియె
కుచ్చితంబుగ నీ గతిన్
చిదిమివైచిరి, యదిమిపెట్టిరి,
నాల్గు దెసలకు నెట్టుచున్
తెలుఁగుబిడ్డా! మఱచిపోకుర
తెలుఁగు దేశము పురిటిగడ్డర
కొంకొక్కరోకోపాటఁ బాడర
తెలుఁగువారల మేలుకొల్పర !!



# తెలుఁగు నాయకులు

తెలుఁగువారికిఁ దెలుఁగురాష్ట్రము
తేర తేరఁగ నూడిపడునా!
ద్రవిడమంత్రి ముఖావలోకన
భాగ్యసంపద యబ్బినప్పుడు,
తెలుఁగు మంత్రులు మంత్రవిదులై
మూఁగనోమును బట్టినప్పుడు,
తెలుఁగు శాసనసభ్యులెల్లరు
తెల్లమొగములు వైచునప్పుడు,
తెలుఁగుబిడ్డా! లేవలేవా!
వీరపాణముసేయ రావా!!

తెలుఁగువారికిఁ దెలుఁగురాష్ట్రము
తేర తేరఁగ నూడిపడునా!
ఆంధ్రకేసరి రేయిఁబవలును
గుహల నిద్దురఁబోవునప్పుడు,
మాఱుమోఁగెడి సింహగర్జలు
మాఱుమూలలఁ జేరినప్పుడు,

చెన్నపట్నము వదలిపెట్టఁగ
సాహసింపక యున్నయప్పుడు,
తెలుఁగుబిడ్డా! లేవలేవా!
వీరపాణముసేయ రావా!!

తెలుఁగుఁవారికిఁ దెలుఁగురాష్ట్రము,
తేరతేరఁగ నూడిపడునా!
గద్దెయెక్కిన గద్దెవారలు
గద్దతింపులు మానినప్పుడు,
నిలువుమీసముపైని నుండిన
నిమ్మకాయలు జాఱునప్పుడు,
అరవసచివునిమాట లనుచో
నులికిపాటును బొందునప్పుడు,
తెలుఁగుబిడ్డా! లేవలేవా!
వీరపాణము సేయరావా!!

తెలుఁగువారికిఁ దెలుఁగు రాష్ట్రము
తేరతేరఁగ నూడిపడునా!
ఏమిచెప్పిన నేమి వచ్చునో
యేమిరాభగవంతుఁడా యని

తెలుఁగుడాక్టరు తెలుఁగుదేశము
నాడిఁజూచుచు నిల్చునప్పుడు,
కాలమాన పరీక్షఁ జేయుచు
నడ్డసాళులు వైచునప్పుడు
తెలుఁగుబిడ్డా! లేవలేవా!
వీరపాణము సేయరావా!!

తెలుఁగువారికిఁ దెలుఁగురాష్ట్రము
తేరతేరఁగ నూడిపడునా!
రెడ్డిదొర గురుపాదులకు జే
జేలుపెట్టుచు నిల్చునప్పుడు
తెలుఁగురాష్ట్రము పనికిరాదని
తెల్పనేర్చితి ననెడునప్పుడు
తెలుఁగుపత్రిక లసలె ముట్టుట
మానివేసితి ననెడునప్పుడు
తెలుఁగుబిడ్డా! లేవలేవా!!
వీరపాణము సేయరావా!!

తెలుఁగువారికిఁ దెలుఁగురాష్ట్రము
తేరతేరఁగ నూడిపడునా!

ఆంధ్రరాష్ట్రముగూర్చి యాంధ్ర మ
హర్షి యేదియు చెప్పునప్పుడు
అదనులోపలఁ దెలుఁగు దేశము
వదలి యప్పటికప్పు డొక్కఁడె
తెల్లవారల సీమకుం జనఁ
బైన మట్టే కట్టినప్పుడు;
తెలుఁగుబిడ్డా! లేవలేవా!
వీరపాణము సేయరావా !

తెలుఁగువారికిఁ దెలుఁగురాష్ట్రము
తేరతేరఁగ నూడిపడునా !
కాలిదెబ్బను గాళినాథుఁడు
కలవరింతలు పెట్టునప్పుడు,
ఆసుపత్రిని నున్నయప్పుడె
యాజ్ఞపత్రము వచ్చినప్పుడు
నక్కచావుగఁ దెలుఁగురాష్ట్రము
పనికిరాదని చెప్పునప్పుడు;
తెలుఁగుబిడ్డా! లేవలేవా!
వీరపాణముసేయ రావా!

తోడుఁబోతుల నమ్మనేలా !
కాఁడుపఱచిరి యనఁగనేలా
తోడుతోడన్ నడుముగట్టిన
నూడిపడదే తెలుఁగురాష్ట్రము
వీరగంధము పూయరాదా !
వీరతాయెతు కట్టరాదా !
వీరపాణము చేయరాదా !
వీరుఁడవె నీవైనచో.

మొకమొకంబులఁ జూడనేలా !
రకరకంబుల మాటలేలా !
ఊరు ఉకమును ఒక్కటైతే
ఊడిపడదా తెలుఁగురాష్ట్రము!!



# ప్రతాపరుద్రీయము

తెలిసికోర యుగంధరుం డను
తెలుఁగుబ్రాహ్మణమంత్రి లేఁడుర
తెలిసికోర జనార్దనుండను
తెలుఁగు బ్రాహ్మణమంత్రిలేఁడుర
వినర వేంకటరాయశాస్త్రిల
పిచ్చివాఁడునుగూడ లేఁడుర
పేరిగాఁ డను పెద్దచాఁకలి
పెధవ యంతకుమున్నె లేఁడుర

తెలుఁగుబిడ్డా ! తెలుఁగు చరితను
నేఁటికైనను దెలిసికోరా !!

ఢిల్లి కేగినమాట యున్నది
ఢిల్లిసుల్తాన్ బట్టుటున్నది,
ఓరుగంటి ప్రతాపరుద్రుని
నోరుగంటిని జేర్చుటున్నది,
ఆ యుగంధరమంత్రి దీనిని
నంత చేసెను ననుట యున్నది,

ఔర! ఔర!! ప్రతాపరుద్రుని
నాటకం బదె బూటకంబుర
తెలుఁగుబిడ్డా ! తెలుఁగు చరితను
నేఁటికైననుఁ దెలిసికోరా !!

ఢిల్లిదగ్గర గంగయుండెనొ ?
గంగయొద్దున ఢిల్లియుండెనొ ?
గంగమీఁదను బడవయెక్కిన
ఓరుగంటిని జేరఁగలఁడే ?
ఔర! వేంకటరాయశాస్త్రి!
ఔర! వేంకటరాయశాస్త్రి ! !
ఎంత బొంకును బొంకి పోతివి,
చచ్చి యెచ్చట నుంటివోకద.
తెలుఁగుబిడ్డా ! తెలుఁగుచరితను
నేఁటికైననుఁ దెలిసికోరా !!

ఓరుగంటి ప్రతాపరుద్రుని
యొద్ద బ్రాహ్మణమంత్రియొక్కఁడె;
ఊరు పేరును లేదు వానికి
నూర కాతఁడు మాసిపోయెను;

బ్రాహ్మణేతరమంత్రు లుండిరి,
వారు తీర్చిరి రాచకార్యము,
కార్యఖడ్గములందు చతురులు,
కాని వారల నెఱుఁగ రెవ్వరు!
తెలుఁగుబిడ్డా! తెలుఁగుచరితను
నేఁటికైనను దెలిసికోరా!!

ముక్కు ప్రతాళ్ళను బోసి రిపులకు
ముప్పదేడులు రాజ్యమేలెను
సాహసాంకుఁడు చటులవిక్రమ
శాలి మా ముసునూరి కాపయ
ఓరుగంటిని తోలఁగిపోయిన
తెలుఁగువారల ప్రతిభ నిల్పెను
తెలుఁగువారల కత్తిదెబ్బలు,
దిక్తటంబుల మరల మ్రోఁగెను
తెలుఁగుబిడ్డా! తెలుఁగుచరితను
నేఁటికైనను దెలిసికోరా!!

ఓరుగంటి ప్రతాపరుద్రుఁడు
బందెపోవుట వాస్తవంబే,

బందెతీర్చిన మాసటీఁ డొక
బ్రాహ్మణేతర దండనాథుఁడు
"రాయబంది విమోచకుం"డను
రాయబిరుదముదాల్చె నాతఁడు
ప్రజలు నేఁటికి మఱచిపోయిరి
వాని మాటను జెప్ప రొక్కరు

తెలుఁగుబిడ్డా! తెలుఁగు చరితను
నేఁటికైననుఁ దెలిసికోరా !!

బందె వదలిన పిదప రాజ్యము
నేలలేదు ప్రతాపరుద్రుఁడు,
సిగ్గుచేతను గౌతమీనది
చెంతఁ జేరుచుఁ దపముచేయుచు
బందెవీడెను—బొందె వీడుచు
భూతలేశ్వరుఁ డంతెగానీ
ఓరుగంటిని మరలఁ గంటను
నొక్కనాఁడునుఁ జూడలేమర

తెలుఁగుబిడ్డా! తెలుఁగు చరితను
నేఁటికైననుఁ దెలిసికోరా !!

తప్పుపాటలు పాడఁబోకుము,

తప్పుమాటలు చెప్పఁబోకుము,

తప్పుకథలను జదువఁబోకుము,

తప్పుదారులఁ ద్రొక్కఁబోకుము,

ప్రాఁతకథలను దెలిసిచదువుచు,

పాటఁబాడుము పరులు మెచ్చఁగ

కల్లవ్రాఁతలు తొలఁగ బుచ్చుము,

కల్లకథలనుఁ బులిమి పుచ్చుము

తెలుఁగుబిడ్డా తెలుఁగు చరితను

నేఁటికైననుఁ దెలిసికోరా !!



# సారంగధర



రంగభీముఁడు మాళ్వదేశపు
రాజు రాజనరేంద్రవరునకు సా
రంగధరుఁడను కూర్మిబిడ్డఁడు,
ప్రథితసాధ్వి పతివ్రతామణి ర
త్నాంగి యనెడి కళత్ర మొకర్తె,
హావ భావ విలాసినీమణి చి
త్రాంగి యనునొక భోగకామిని
యలరు చుండిరి వైభవోన్నతిచే

తెలుఁగుబిడ్డా! తెలుగుచరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా!!

అంగజ ప్రతిమానరూపుఁడు
యౌవనస్ఫుటదీప్తతేజుఁడు, సా
రంగధరుని గాంచి, మోహాము
రగులుచుండఁగ భోగకామిని చి

త్రాంగి, పైఁబడెఁ బాపురాలకుఁ
దనదునింటికి వచ్చినప్పుడు. సా
రంగధరుఁ డోడఁ బడమి చేతఁ బ
రాభవంబునఁ గ్రుళ్ళి కుసుమారెన్.

తెలుఁగుబిడ్డా! తెలుఁగు చరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా!!

అంకు లెన్నో యంటఁగట్టుచు
రాజుతోఁ జిత్రాంగి చెప్పెను,
అంకె వేయుచుఁ గన్నబిడ్డను
రద్దిఁజేయుచుఁ, గాలు సేతులఁ
గొంకకే నఱికించి వైచెను
గొలువు వద్దని చెప్పుచుండిన,
వేంకట కవీంద్రుఁ డిది చెప్పెను
వెనుక కాలమునందు నెప్పుడో

తెలుఁగుబిడ్డా! తెలుగుచరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా!!

ఔర! రాజనరేంద్రుఁ డనిమొడి
నామసామ్యముచేత నెవ్వరో

మాళ్వదేశపురాజు కథలను
గౌతమీనదిచెంతఁ జేర్చిరి.
తెలుఁగురాజున కంటఁగట్టిరి,
తెలుఁగువారికి నచ్చఁజెప్పిరి,
తెలుఁగు దేశము నాల్గుమూలల
తెలుఁగు కథయని పులిమి పుచ్చిరి,

తెలుఁగుబిడ్డా! తెలుగుచరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా!!

ఇదిగొ చిత్రాంగి దగు మేడన,
నదిగొ సారంగధరు మెట్టని
ప్రజలు గట్టిగఁ జెప్పసాగిరి,
ఇదిగొఘలియన నదిగొ తోఁకని
చెప్పుచుందురుగాదె లోకులు
చిలువ పలవలుచేసి, యీ కథ
దేశమెల్లను నల్లుకొనియెన్
తెలుఁగువారల సొంత కథగా

తెలుఁగుబిడ్డా! తెలుఁగుచరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా!!

ఔరా! యీ కథ యిట్టు లుండఁగ
వేఱె "కఁపిలి" శాసనంబున
మాఱుపేరులతోడ నీ కథ
బయట పడియెను నిన్న మొన్న నె,
ఏమి చిత్రమొ! యొక్క కథయే
ఇన్ని చోటుల నవతరించెను,
విన్న వారలు నవ్వకుందు రె!
పిన్న పెద్దలు నవ్వకుందు రె!!

తెలుఁగుబిడ్డా! తెలుఁగుచరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా!!

లేఁడు సారంగధరుఁ డనియెడి
సుతుఁడు, రాజనరేంద్రునకున్
లేదు చిత్రాంగియను వేశ్యయు.
తెలుఁగు దేశపుఁ జరిత గాదిది,
తెలుఁగురాజుల చరిత గాదిది,
వట్టి బూటకమయ్యె నీ కథ,
పిట్టకథయే! పిట్టకథయే!!

తెలుఁగుబిడ్డా! తెలుగుచరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా!!

# నాఁడు - నేఁడు

కమ్మకట్టును కమ్మగుట్టును
కమ్మపౌరుషమును కీర్తిచే,
కమ్మనాఁటను దాఁటిపోయెను
గంతుపెట్టుచు పూర్వమున్;
కత్తిఁజూపిరి సొమ్ముఁజూపిరి
కమ్మవారలు రాజులై,
కానివానికి లోఁగువానికిఁ
గమ్మనాఁటను పూర్వమున్.
భూమి నమ్మక బ్రతుకుచుండిరి
కమ్మవారలు బూర్వమున్.
భూమి నమ్మక బ్రతుకుచుండిరి
కమ్మవారలు నేఁడెటో!
మఱచిపోవకు మఱచిపోవకు
మాన్యులౌ మన పూర్వులన్,
మఱచిపోవకు తాత తండ్రుల

మంచిమాటల నన్నిటన్,
వేఁగుఁ జుక్కదె వెల్గుచున్నది
తూర్పుదిక్కునఁ జూడుమా!
వీఁగిపోవకు కమ్మబాలుఁడ
వెఱ్ఱిపోకలు పోవుచున్.



## మరచి పోవద్దోయి....

పగవారు మనపైకి వచ్చిపడ్డారు,
కోయంచు మనయూళ్ళు కొల్లగొట్టారు,
గూటిలో పిట్టల్ని కూల్చివైచారు,
పొలములో పసిలేళ్ళ పొడిచివైచారు,
మరచిపోవద్దోయి మరచిపోవద్దు!
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు!!

కారుకోనలు దూరి కలిగి పొయ్యారు,
దుంపకూరలతిండి ద్రుంగి పొయ్యారు.
గోచిపాతలు కట్టి క్రుంగి పొయ్యారు,
ప్రొద్దెల్ల మనవారు పొగలి పొయ్యారు
మరచిపోవద్దోయి మరచిపోవద్దు!
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు!!

పంగిళ్ళ కయ్యాల పంత్రించినారు,
పసిపాప యుయ్యాల పారదన్నారు.
నిదురపోనీకోయి నీ చేతికత్తి
త్రాగించు పగవారి రక్తంబు నెపుడు,
మరచిపోవద్దోయి మరచిపోవద్దు!
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు!!

# " పిలుపు "



ఊరకుండి యుండలేక
యూరువిడచి వచ్చినాము
పొట్టకూడు లేక కాదు
కట్టుగుడ్డ లేక కాదు
కానిడబ్బు కొఱకుఁగాదు
కానిపనులు కొఱకుగాదు
పేరుకోసరంబుగాదు
పేరుపేర్మికొఱకుఁగాదు

ప్రాలుమాలక బద్ధకింపక
యాలకింపుఁడు తెలియఁబఱతుము

ఊరుకొఱకు వచ్చినాము
నాడుకొఱకు వచ్చినాము
బీదసాదలైనవారి
పిలుపువినుచు వచ్చినాము
కూడులేక మాడుజనము

గోడువినుచు వచ్చినాము
దాస్యముఁ బాఱఁద్రోల

ప్రాలుమాలక బద్ధకింపక
యాలకింపుఁడు తెలియఁబఱతుము

రోజురోజు పోవుచుండె
రోజకుండా నెంతోడబ్బు
ఇతర దేశజనుల చేతి
కేమి సెప్పవార మిపుడు!
సాలినేఁత సాలివడియె
మాలనేఁత మూలఁబడియె
సాలివారు మాలవారు
చచ్చుచుండ్రి కూలిలేక

ప్రాలుమాలక బద్ధకింపక
యాలకింపుఁడు తెలియఁబఱతుము

ప్రత్తిపంట పండుచుండె
జీవయాత్ర సాగకుండె
దూది యేకువాఁడు లేఁడు
ఏకుచేయు వాఁడు లేఁడు

నూలు వడకు వాఁడు లేఁడు
నేఁత నేయు వాఁడు లేఁడు
యింతమంది యేల లేరొ
యించుకంత తెలిసికొనుఁడు

ప్రాలుమాలక బద్దకింపక
యాలకింపుఁడు తెలియఁబఱతుము

కానిదూది బట్టనేసి
కాసుకమ్ముచుండె మనకు,
కాసుపోక యొకటె కాక
కూలి నాలి కూలిపోయె
పల్లెటూళ్ళు పాడువారె
ముతక బట్ట లేకపోయె
బట్టలమ్ము వర్తకుండు
పట్టణంబు చేరిపోయె

ప్రాలుమాలక బద్దకింపక
యాలకింపుఁడు తెలియఁబఱతుము

ఇరుగు పొరుగు వారికెల్ల
కూడుగుడ్డ లేకపోయె

కడుపునింతొ మాడుచుండె
మాడు చెక్కలైన లేక
లాంక్షైరు నేతగాండ్రు
లాభమందు చున్నవను
షాహుకారు కోట్లకొలంది
సంతరించుచుండ్రిడి ధనము

ప్రాలుమాలక బద్ధకింపక
యాలకింపుఁడు తెలియఁబఱతుము

లాతిగుడ్డ గజమునమ్మ
గజముక్రుంగు నీదుజాతి
... ...
... ...
కడుపుచల్ల కదలకుండ
కల్లగాదు, బ్రతుకరాదు
పారతంత్ర్య మెన్నివేల
యేండ్లకైన వదలఁబోదు

ప్రాల:మాలక బద్ధకింపక
యాలకింపుఁడు తెలియఁబఱతుము

నదురు బెదురు మాని లాతి
గుడ్డలమ్మ మానుఁడయ్య
జాతియొక్క గౌరవంబు
చంపివేయఁ గూడదయ్య
కదురుగుడ్డ లమ్మ్కొనుఁడు
కదురనేఁతను గుదురు మోక్షము

ప్రాలుమాలక బద్ధకింపక
యాలకింపుఁడు తెలియబఱతుము

ఒక్కకులము కొఱకుఁగాదు
ఒక్కజాతి కొఱకుఁగాదు
ఒక్కమతము కొఱకుఁగాదు
ఒక్కనీతి కొఱకుఁగాదు
పోకలాడి పొంచియుండి
పొలకరింప మేలులేదు
దొంగమాట దాగఁబోదు
దొంగవడక సాగఁబోదు

చోటులేదిట పెత్తనమునకు
ఆలకింపుఁడు తెలియబఱతుము

85

చేతులొగ్గుచు దండమందుము
దండమన్న సుంతజంకము
వేఁడికోళ్ళ నాలకించి
లాఠిగుడ్డ లమ్మవలదు

( పికెటింగ్ సందర్భంలో వ్రాసింది )



# గోపాలరాయ శతకమునుండి

తగవుదీర్చెదనంచు ధర్మపన్నముఁజెప్పి
మైనవారికుటుంబ మార్పినావు
తిట్టినాడని చెప్పి దీర్ఘరోషమ్మున
మేనత్తకొడుకుఁ జంపితివి నీవు
దయతోడఁ దల్లిని దండింపకుండిన
మేనమామనుబట్టి మెసవినావు
సరిగావు నాసహోదరి ముట్టఁదగవన్న
బావజుట్టు గొరిగి పంపినావు
ఇట్టి తుచ్ఛుఁడ వీవుగాఁబట్టికాదె
గాడిద యొగిరి నిన్నుబండ్లాడఁ దన్నెఁ
గట్టుకొన్నది నెత్తిపై కాలుబెట్టె
పనికిమాలిన యోరి గోపాలరాయ!!

పిన్నపెద్దలు నవ్వ గన్నతల్లికినీవు
కడుపు చింపించిన ఘనుఁడవయ్యా
ఎల్లప్పుడును గల్లునేత్రావు చుండెడి

పాలసుండే నీకు భ్రాతయయ్యా

...  ...  ...

...  ...  ...

ఇంటికివచ్చిన ఋషిపుంగవునిఁ దగు
లొ్ౘని పోయినట్టిది యనుజయయ్యో
వహ్వారే! సెభాష్! మీవారి పరువుదెలిసె
నత్తగుల్ల లోకౘమెడ రత్నము లోకౘ
మెడను గల్గున నెడిమాట ఋతముగాదె
పనికిమాలిన యోరి గోపాలరాయ!!



# చెన్నకేశవా!

నిరుపమ వీరవైష్ణవుఁడు
నీ ప్రియభక్తుఁడు బాలచంద్రుఁడో
క్రూరుఁడయి పోరఁగూలునెడఁ
గన్గొని యూరక యున్న నీవు మ
మ్మరసి కటాక్షవీక్షణ స
మాదరణమ్మునఁ జూతువన్న నే
కరణిని మాకు నమ్మకము
గల్గునొ చెప్పవె చెన్నకేశవా!.
దూరభారమనక మేము త్రొక్కుపడుచు
వచ్చినారము నిను జూచు వాంఛతోడ
చెన్నకేశవా! కోరము చిల్లిగవ్వ
చిత్తశుద్ధి మాత్రము దయచేసి పంపు!!

---

ఈ పద్యాలు పంపిన
శ్రీ సజ్జా వీరయ్యగారికి, శ్రీ నన్నపనేని సుబ్బారావుగారికి ధన్యవాదాలు.

# మా రా మ శా స్త్రి

పిడుగువంటి నీ మృతివార్త విన్నయపుడు
గుండె దడదడమంచును గొట్టికొనుచు
నాఁగిపోయెనో యనుకొంటి నక్కటకట!
ఱాతిగుండియ గాన నేఁ బ్రతికియుంటి !!

ఎట్టెట్టూ! నీ మరణమ?
పట్టెది: నిజమైనయెడల బట్టతలపయిన్
జుట్టుపిలకతో నెప్పుడు
కట్టెదుటను నాకు నీవు కన్పడఁగలవే?

ఎన్నటికిఁ గూడ మనమింక నేకతమున
ముచ్చటలతోడఁ బ్రొద్దులు పుచ్చలేము;
కాని యొకదారి నేఁజూపఁగలను సఖుఁడ
నీవు చెవియిచ్చి విన్నచో నిక్కువముగ!!

కలలు గలవయ్య; కలలందుఁ గానివారె
యొక్కరొకరితో మాటాడుచుందురెందుఁ
గాన మఱచిపోకుండఁగా కలలలోని
కప్పుడప్పుడు రావోయి! తప్పకుండ!!

హోరాము వదలి పెట్టక
మూరాములు చేయమాని మంచితనముతో
మూరామశాస్త్రివిక దా
రారా! నాకలలనొక్క రాతిరి యైనన్!!

కలలలోనికి నీవచ్చు కాలమందు
నచటి సంగతులన్నియు నవగతంబుఁ
జేసికొనిరావలయు; నాకుఁ జెప్పఁగాద
యేని, నిన్ను ప్రశ్నలచేత నేడిపింతు!!

ఉట్టిపడుచుందువు తెనాలిపట్టణమున
కేడనుండియో నీవెవ్వరెఱుఁగకుండ
వచ్చి యట్టియేమేమొ వ్రాక్రుచ్చుచుందు
విట్టివారలు నాకింక నెవరుగలరు?

స్వార్థరహితుండవగుచు నీజన్మయాత్ర
కట్టకడదాఁక నౌకరీతిఁ గడపినావు
ధన్యుఁడవు సూవె! నీవంటిధర్మశాలి
యదనుగాఁ జిరకాలంబు బ్రతుకబోఁడు!!

ముందుగాఁబోయితివి స్వర్గభూమికచట
క్రొత్తగా వచ్చునాకు కొంగ్రొత్తలన్ని
చెప్పుటకు విశేషంబుల సేకరించి
పెట్టుమోయి మనముబుసు వెళ్ళఁబుచ్చ!!

ఆతురముతోడ నేమైనఁ జేతువేమొ!
నీవు "దేశద్రిమ్మరులును" నీతిజాతి
వావివరుసలు లేనట్టివారు గాన
నాఁగుమోయి! నేవచ్చెడు నంతదాఁక!!

నీకు నచ్చినకన్య నే నెమకినెమకి
ప్రేమదైవార నన్నుద్ధరించినావు
చెల్లిలిని జూడ దివికేగఁ జెల్లెనీకు
నింత సాహసివనుమాట నెఱుఁగ మెపుడు!!

నేమరణించినప్పు డతినిష్ఠను జ్ఞాపకచిహ్నమేదియో
యేమెయి నేనిగూర్తువని, యిచ్చటనుంటిని గంపె
డాసతో
యీమెయిఁ జేసిపోయితివె? యీపని నాకిపు
డప్పగించితే
నీమరణంబు గూర్చియిటు నేనులిఖింపఁగ, నేటికబ్బె నే!

పుట్టిరి, పెరిగిరి, గిట్టిరి
చెట్టలు పదివేలు; నీవు చేపట్టితివీ
పుట్టువు చరితార్థంబుగ
గట్టిగ ధర్మంబు కీర్తికాయుఁడ వగుచున్!!

అంగలూరున నీచేసినట్టిపనులె
చాటుచుండును నీకీర్తి సకలదిశల;
పద్యములును గద్యములు నీపాటలేల!
నీచరిత్రంబు లోకంబు నింపుకొనును!!

సెలవా నాకిఁక నినునే
సెలవడిగిన నెంతచింత చెందెదవైనన్
సెలవే నేటికి మిత్రమ!
సెలవిప్పింపవుగ నాకుఁ జిత్తము చెదిరెన్!!

1 ఆగష్టు 1934 ప్రజామిత్రనుండి.



# అనుబంధము

## 'వీరగంథము' - 'పిలుపు'

ఈ గీతములు 1929 లో ఉప్పు సత్యాగ్రహమప్పుడు వ్రాసినారు. వారప్పటికి తెనాలి పురపాలక సంఘాధ్యక్షులు. సత్యాగ్రహ సమరమునకు కొన్నివేల రూకలు విరాళము ప్రోవుచేసి, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు నాయకత్వము వహించిన దళమునకు యీ గీతములతోపాటూ సంగీడ్కొలిపినారు. అందుచే వారి నానాడు కారాబద్ధులను జేసినారనియు, కాని వారు కాంగ్రెసువాదిగా చెలఁబట్టబడుట నాటి జస్టిస్ పక్షప్రభుత్వము ఇచ్ఛగింపక చప్పుడులేకుండ విడిచిపెట్టించినది.

2. 'తెలుఁగువారల కత్తిదెబ్బలు గండికోటను కాంచినప్పుడు'— పెమ్మసానివారి గండికోట అనంతపురము జిల్లాలోనున్నది. హంపీరాజ్యమున కది ఆయువుపట్టు. గోల్కొండ, అహమ్మద్‌నగర్ సుల్తానులు తోడ్పడిన గుల్బర్గను రాయలు గెల్చుటకు గండికోటవారు గట్టికారణము. అళియ రామరాయలు విజయనగరపు కోటలో నుండలేక గండికోటలో తలదాచుకోగా, గండికోటవారు అతనిని తిరిగి విద్యానగర సింహాసన మెక్కించినారు. గోల్కొండ నవాబు 1586 లో గండికోట నాక్రమింపగా తిరిగి వశపరచుకొన్నారు. గండికోట పట్టువడక హంపీ తురకలకు చిక్కలేదు.

3. 'దూరమందున నున్న సహ్యజ కత్తినెత్తురు కడిగినప్పుడు' సహ్యజ అనఁగా కావేరి ఈ పంక్తి తంజాపుర నాయక రాజ్యపతనమును చెప్పుచున్నది. తంజాపురి విజయరాఘవుని తల తెమ్మనఁగా మధుర చొక్కనాథునితో కలిగిన యుద్ధము (1673) నాటి తంజాపురి కోట వీరబొబ్బిలిని మరపించినది.

3. 'కంచికోటల కంచుతల్పులు ఖంగు ఖంగున మ్రోగు నప్పుడు'–కాకతీయులు కంచితల్పులు పగులగొట్టుట ప్రసిద్ధము. మొదటి ప్రోలరాజు (1050-1080) తన బ్రహ్మనన్న సేనాని నంపగా, నతడు కాంచీదుర్గకవాట భేదన మొనరించి జయించి నాడు. మరల ప్రతాపరుద్రుని కాలమున తెలుగు చోడుడగు మనుమగండ గోపాలు–కాకతీయ సామంతుడు– నోడించి పాండ్యులు కంచి నాక్రమించిరి. ముప్పిడి నాయకుడు రేచర్ల ఎఱ్ఱదాచానాయని నంపగా పోయి పాండ్యపంచకము నోడించి 'కంచికవాట చూఱకార' అను బిరుదమందెను. కాంచీ చోళ రాజ్యము కాకతీయులవల్లనే అంతరించిపోయినది. ఆ పిమ్మట పాండ్యులు చేరులను కూర్చుకొని రాగా ముప్పిడి నాయకుడు ఆదాక్షిణాత్య కూటమి నోడించినాడు.

4. 'మధురకోట యగడ్తలన్నియు జివ్వజివ్వన దూకు నప్పుడు – హంపీ బుక్కరాయని పుత్రుడైన కుమార కంపని దక్షిణ దిగ్విజయ యాత్రను కీర్తించుచున్నది. కంపరాయల దేవేరి గంగాదేవి దీనిని'మధురా విజయ'మను పేర వ్రాసినది. హోయిసల వీరభల్లాణుని నరికించిన మధుర సుల్తానులను కూకటివ్రేళ్ళతో పెళ్ళగించి ద్రవిడదేశమును నిస్తురుష్కము గావించినాడు.

'తంజనగరపు కోటగోడలు దూకుట' 'తిరువటంబున జేరసేనలు కెవ్వకెవ్వన నరచుట'యును యీ దండయాత్రా ఘట్టములే. ఇందుతోడ్పడిన సేనానులు జింజి గోపన్న, సాళువమంగి, ఫలితముగా మధురాంధ్ర నాయకపాలనము తర్వాత కుదురుకొన్నది.

6. 'తెలుఁగువారల యేటుపాటులు తెలిసిమెలఁగిన గోలు
కొండ విజాపురంబును నాముదాపురి'—

కృష్ణరాయల నాడేకాక, పిమ్మట అళియరామ రాయలు హండే హనుమప్ప సహాయుడుగా దక్కను తురష్క రాజ్యములు నాల్గింట మూడగు బీజపూరు (విజాపురము) గోలుకొండ, అహమ్మద్ నగర్ (ఆముదాపురి) రాజ్యముల నోడించినాడు. గోల్కొండ ఏల్బడి పెంపొందినది రామ రాయల అనంతరమే.

7. 'మందేరా'- గ్రాంథికము విడిచి వాడుకలో వెలసిన యీ వీరగీతమునకు రాయలవారి చాకలికట్టిన పాట యొరవడి.

రాయలవారు కళింగ జైత్రయాత్రకు తిమ్మరుసు మంత్రిని ముహూర్తము పెట్టుమన్నారట. తిమ్మరుసు తను నిశ్చయించిన ముహూర్తము బలము పరీక్షించుటకు మంత్రాక్షతలు పట్టి చాకలి యింటిమీద చల్లి చూరుక్రింద పొంచి నాడట. చంకలో కొడుకు నాడించు చాకలి శివమెత్తి,

కొండవీడూ మందేరా !
కొండపల్లి మందేరా !
కాదని వాదుకు వస్తే
కటకందాకా మందేరా !

అని వెనుక ముందులకు కవాతుద్రొక్క నారంభించినాడఁట. ఆ చాకలి వాక్కు ఫలిస్తుందని ఆ ముహూర్తములో రాయల సైన్యాలు తూర్పు జైత్రయాత్రకు బయల్దేరినవట.

ఆ మడివేలు పాట మరల 1935లో కవిరాజు కలములో మార్మోగినది. ఈ గీతమును, సారంగధర చరిత్రమును డా. జి. వి. కృష్ణరావుగారి 'కౌముది' పత్రికలో అచ్చయినది.

8. 'రాయబంది విమోచకుడు'– రేచెర్ల అనపోతానాయడీ బిరుదు వహించినాడు. కాని అతడు ప్రతాపరుద్రుని నాట కత్తిబూనినవాడు గాదు. అతని తండ్రి సింగమనాయడును ఆ బిరుదుగలిగి యుండు ననుచున్నారు. యుగంధర మంత్రి ఉదంతము నేటి చారిత్రకు లెల్లరు కట్టుకతగానే భావించు చున్నారు.

9. సారంగధర చరిత్రము : వేంకట కవీంద్రుడిది చెప్పెను వెనుక కాలమునందు నెప్పుడో"

సారంగధర చరితమని ప్రసిద్ధికి వచ్చినది చేమకూర వెంకటకవి కావ్యముతోనే. గౌరన్న నవనాథచరిత్రమందు, చేమకూరకువలెనే దీనిని మాల్వదేశపు చరిత్రగానే చెప్పి యున్నాడు. పేరు మార్పులతో నీకత కన్నడదేశ చారిత్రక గాథగాను, మహారాష్ట్ర చరిత్రముగను కూడ నున్నది. కన్నడమున కుమారరాముని కథ, మహారాష్ట్రియందు కృష్ణాగరుడిగాథ. మరొక్కచో భువనేశ్వర, చంద్రావతి శోభావతుల కథ. ఇట్లుండ కంపిలి శాసనమొక కథ చెప్పుచున్నది. కంపిలి యనగా పూర్వ హంపీరాజ్యమన వచ్చును.

సారంగధర చరిత్రమును మన రాజరాజనరేంద్రుని కంటగట్టుట అప్పకవితో ఆరంభమై, శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిలుగారితో బూర్తియైనది. ఇందు కెట్టి చారిత్రాకాధారములును లేవు.

విజయవాడ
19-3-1964

త్రిపురనేని వేంకటేశ్వరరావు

## కవిరాజు ఇతర గ్రంధాలు

సూత పురాణం

శంబుకవధ

ఖూనీ

భగవద్గీత

కురుక్షేత్ర సంగ్రామం



Wrapper Printed at
Vidyoda Printers, Vijayawada-2.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA 102B142 |
| పుస్తకం పేరు | కవిరాజు శిలతెలుగేలవలు |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI, 4, 2,50,32,30, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | nandini |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |